Regd No. H. 45 / M 3813

వెల ఒక అణా

102566

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౬ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషసం॥ర జ్యేష్ఠ బ॥ ౧౦ (౧౯-౬-౧౩౫౦ ఫ.) గురువారము సంచిక ౧౪

# యుద్ధకాండ

## శనివారమునుండి జరిగినవిశేషాలు

### రష్యా జర్మనీ సంబంధము

ఈమధ్య సుమారు మూడు నాలుగు మాసాలనుండి రష్యాకును జర్మనీకిని సంబంధములు విషమించుచున్నవని యూరోపులోని కొన్ని దేశాలపత్రికలు ప్రచారముచేయుచున్నవి. జర్మనీకి రష్యా దక్షిణభాగంలోని యూక్రేను అను సారవంతమయిన భూభాగముపై కన్ను ఉన్నదనియు అందుకుగాను జర్మనీవారు రష్యాసరిహద్దులపై లక్షలకొలది సైన్యాన్ని బారులుతీర్చి నిలబెట్టిరనియు చెప్పబడుచువచ్చెను కానిప్రతిరదవకూడా రష్యావారు ఇవియన్నియు అసత్యవార్తలనియు, వారికి జర్మనీకి గల మైత్రిలో యెట్టిలోపములేదని ప్రకటించుచునుండిరి. మొన్నటి శుక్రవారంనాడు రష్యాలోని మాస్కో రేడియోనుండి రష్యాకు జర్మనువారితో పోలాటయుద్ధప్రయత్నములు లేవని తెలిపిరి.

### ఇంగ్లండుపై దాడులు

జర్మనీలో గోబెల్సు గారు ఒక వ్యాసమువ్రాసినారట అందుజర్మనీవారు ఇంతలో ఇంగ్లండుపై దండయాత్రచేయుదురని వ్రాసినారట. అట్టిముద్రితప్రతులను జర్మనుప్రభుత్వమువారు జప్తీచేసినారట. ఇదంతయు బూటకనాటకమని రాజకీయవేత్తలభిప్రాయపడుచున్నారు. ఇంగ్లండులో కొన్ని యంత్రాలయాలలో కూలీలుసరిగాపనిచేయకయున్నారంది పెట్టుచున్నట్లు వార్తలుతెలుపుచున్నవి ఇవన్నియు కమ్యూనిస్టులు చేయుచున్నారనియు అట్టివానిని బాగానిరోధించుచుంటిమనియు ప్రభుత్వమువారుప్రకటించుచున్నారు. పోయినవారములో జర్మనులు ఇంగ్లండులో బాంబులువేయుటవలన ౫౬౭ మందిచనిపోయిరనియు, ౫౧౭౧ మందిగాయపడిరనియు, ఏప్రిల్ నెలలో ఈసంవత్సరంలో ౬౦౬౫ మంది యొక్కవరకు నష్టముయిరనియు గతసెప్టెంబరు నుండి యింతవరకు ౪౧౭౩౭ మంది బాంబులచే చనిపోయిరనియు యింగ్లీషుప్రభుత్వమువారు ప్రకటించుచున్నారు.

శనివారంనాడు యింగ్లండుపై వచ్చిన జర్మను విమానాలలో ౭ జర్మనువిమానాలు కూల్చబడినవి. అంతకుమించినదాడులు మరేమియు జరుగలేదు.

### సిరియా రంగము

ఇంగ్లీషుసైన్యము సిరియాలోని 'దిమిష్కు' (డెమాస్కస్) పట్టణమును సమీపించుచు ఇపుడు ౬ మైళ్ళదూరములోనున్నారు. ఫ్రెంచి విచీ ప్రభుత్వంవారు ప్రతిఘటించుచున్నారను మాటయేగాని అది లెక్కకు వచ్చునట్లుగా కనపడుటలేదు. ఇంగ్లీషుప్రభుత్వము ఫ్రెంచి ప్రభుత్వానికిట్లు తెలిపియున్నది. ఫ్రాన్సు రాజ్యాలపై ఇంగ్లీషువారికియేమియిన్నిదురాశలేదు. జర్మనువారు ఫ్రెంచి రాజ్యాలలో విమానకేంద్రాలు స్థాపించుకొని ఇంగ్లీషువారినినష్టపెట్టకుండచేయుటకే ఇంగ్లీషువారు సిరియాను ఆక్రమించుకొనవలసివచ్చినది.

ఇపుడు సిరియాలో సుమారు ౪౫౦౦౦ ఫ్రెంచిసైన్యము ఇంగ్లీషువారిని ప్రతిఘటించుచున్నదని తెలియుచున్నది. స్వతంత్ర ఫ్రెంచిసేనానాయకుడయిన డీగాల్ సేనాని సిరియాలోకి ఇంగ్లీషువారిపక్షముగా యుద్ధములో పాల్గొనుచుండగా ఒకవిమానమునుండి బాంబుపడి అతనికిదెబ్బతగిలినది. ఇంకొకదిక్కు సిరియాలో ఇంగ్లీషుసేన సిడాన్ అనుపట్టణమును సమీపించుచున్నది సిరియాలో ఉండుజర్మనులును యిటలీయనులును, టర్కీలోనికి పారిపోవుచున్నారని టర్కీపత్రికలువ్రాసినవి ఈరాఖులోనుండి సిరియాపై దండెత్తిన ఇంగ్లీషుసైన్యములు అలెపో త్రిపోలి రాపట్టణాలను సమీపించుచున్నవి. ౧౫ జూను నాటివార్తలప్రకారం సిరియా సముద్రతీరంలో సిడాన్ పట్టణమును యింగ్లీషువారుపట్టుకొన్నారు. దానికిఉత్తరమునఉండు బైరూట్ అనుపట్టణమును యింగ్లీషువిమానములు పట్టణవాసులకుముందుగానే నోటీసుయిచ్చి తర్వాత బాంబులువేసినవి. అదియింతలో యింగ్లీషువారివశము కావచ్చును.

### తుర్కీ-జర్మనీ సంబంధము

జర్మనీవారు తుర్కీవారికి ఒకస్నేహపత్రమునుపంపినారు. తుర్కీవారికి జర్మనీనుండి యేమియు అపాయముండదనియు తుర్కీవారియెడ జర్మనీకి యేమియు దురుద్దేశములేదని తెలిపినారు. తుర్కీవారుదీనికి హర్షించినారుకాని మాటిమాటికి యింతఆదరణ జర్మనీవారు ఎందుకుచూపుచున్నారోయని యనుమానపడుచున్నారు.

అమెరికావారు యిటలీజర్మనీదేశాలవారి ద్రవ్యము తనదేశంలోయెంతయున్నదో దానినంతయు జప్తీచేసియుండిరి. దానికిజవాబుగా యిటలీజర్మనీవారలుకూడా తమదేశంలోనుండు అమెరికావారి వ్యాపారద్రవ్యమును జప్తీచేసియుంచినారు ఇటలీలో అమెరికావారి ద్రవ్యము ౧౪-౦ ౦౦౦౦ డాలర్లు అనగా సుమారు ౫౬౦౦౦౦౦౦౦ రూ ద్రవ్యముండునని యీ జర్మనీలో అమెరికావారిద్రవ్యము ౪-౨౭౦౦౦౦౦ డాలర్లుఅవగా యించుమించు ౧౬-౫ కోట్లరూపాయలద్రవ్యము వీరిజప్తీలోవచ్చెననియు అంచనావేయబడుచున్నది అమెరికారేవు పట్టణమును న్యూయార్కుపట్టణమువద్ద సముద్రములో ముందుగనులను అమెరికాప్రభుత్వవారు వేయించినారు. ఇంగ్లండుకుచేసినరనగా ఓడలువదుపువారికి శిక్షనుఇప్పించేనిమిత్తం చేసినామని అమెరికావారన్నారు. అమెరికాలో జర్మనువారి వ్యాపారద్రవ్యము ౨౦ కోట్లడాలర్లవరకు జప్తీచేయబడినట్లు అంచనావేయబడినది. అట్లాంటికుసముద్రంలో ఒకజర్మనుఓడ ముంచబడినది. అమెరికాలో ఆఫ్రికావారులైన నీగ్రోలు లక్షలకొలదిగా ఉన్నారు. వారిని అమెరికా తెల్లజాతులవారు ఎల్లప్పటికిని హీనముగాచూచుచు కష్టపెట్టుచుండేవారు ఇప్పుడువారిసహాయంకూడా అమెరికావారికి అవసరమయింది. ఇటీవల చాలాయంత్రాలయాలలో కూలీలసమ్మెలు జరుగుచూవచ్చినవి, ఇట్టిసందర్భములో నల్లనీగ్రోజాతిపై అమెరికాప్రభుత్వానికి ప్రేమకుదిరింది. వారిని తెల్లకూలీలతోపాటు సమానముగా చూడవలెనని, వారిని తక్కువజాతితో చూడటము గొప్పజాతీయనష్టమని రూజ్వెల్టుఅధ్యక్షుడు ప్రకటనచేసెను. అమెరికావారు ౬ డేనిష్ఓడలనుపట్టుకొనిరి. వాటిని వారుయుద్ధావికి వినియోగించుచున్నారు. 'జర్సీ' అనుఇంగ్లీషుఓడ జర్మనువారిచే ముంచబడినది,

### క్రోషియా

యుగోస్లావియాలో "క్రోషియా" అనుపెద్దమండలముండుటయు దానిని జర్మనులువిడదీసి దానికొక నామకార్థపురాజు నేర్పాటుచేయుటయుజరిగియుండెను. ఇపుడాక్రోషియాప్రభుత్వము జర్మనుపక్షరాజ్యాలతో చేరినట్లుప్రకటించినది,

### మధ్యధరాసముద్రరంగము

బ్రిటనువారు యిటీవల ౧౦ యిటలీఓడలను ముంచినారు, ౧ యిటలీద్వీపమువద్ద యిటలీవారియొక్క మరొకఓడనుముంచినారు. బెంగాజీవద్దకూడా యిటలీఓడ మరొకటిమునిగినది "ఇస్టంబోలు"దిక్కుపోవుచున్న యిటలీ పెద్దనావయొకటి చెడగొట్టబడినది ఈతీప్పులో "సొల్లం"

టోబ్రూకు" రేవులమధ్యన జర్మనులను అప్పటనుండి వెళ్ళగొట్టుప్రయత్నములు యింగ్లీషువారు చేయుచున్నారు. మొత్తముమీద గతవారంలో శత్రువులయొక్క ఓడలు ౨౦ వేలటన్నులతూకముగలవి ముంచబడినవి. మధ్యధరాసముద్రంలో యిటలీవారి "కాస్సు" అనుద్వీపముపై యింగ్లీషువారు తీవ్రముగుదాడిచేసిరి.

---

# అబద్ధపు ముచ్చట

మ.ఘు.వ. నిజాం ప్రభువుగారు అధికారికరముగా నుదేదక్కన్‌లో ౧౩ అమర్దాదునాడీ విధంగా సెలవిచ్చినారు.

౧౧అమర్దాదునాటి రయ్యత్ (దిన)పత్రికలో హైద్రాబాదులో డాక్టర్ సర్ జియావుద్దీన్‌గారిచర్యలుఅను శీర్షికతో ఏదైతే వ్రాయబడినదో అదికొనామొదలు అబద్ధమైయున్నది. అతడక్కడికివచ్చినకారణము అతడు వ్రాసుకొన్న విజ్ఞప్తిలోనేయుండినది. ఈప్రభువు అలీగడ్‌విద్యాపీఠ ఛాన్సలరుగా ఉండియుండెను. ఇదేవిద్యాపీఠపక్షాన మాదిరెదక్కన్ మరణవిచారమును తెలుపుకొనుటకు వైస్‌ఛాన్సలర్ అగునతడు వచ్చియుండెను; పైగాఅతడుకాని యింకెవ్వరైనా బయటివారుకాని వారికి రాష్ట్రములోపలయ్యే వ్యవహారాలలో సంబంధములేదు. ఉండకూడదు. అవసరముంటే ఎప్పుడైనా సొంతముపై అట్టివారితో ఆలోచనలు చేయవచ్చును. ఇప్పుడట్టిఅవసరముకూడాకలుగలేదు. ఇట్టివారికి ఏసంస్థయొక్కసభ్యులతోనైనా స్నేహముండుటచేత వారితో కలిసియుండవచ్చును. అది వేరుమాట. గానీ దీ.తో సంబంధములేదు,

మరొకటి ఇదేపత్రికలోహద్దుమీరి యితరవిషయాలపై యేఅభిప్రాయమీయబడినదో అదిసరిగాలేదు. ఎందుకంటే ఈవిషయములో అభిప్రాయమిచ్చేవారికిసంబంధములేదు. సంబంధమున్నదంటే అదిఒకపక్షంలో ఒక అంజామనుకున్నా ఇంకొపక్షములో ప్రభుత్వానికిన్నీ సంబంధముంటుంది. ఇందు మూడవవారికి జోక్యముకలిగించుకొను అధికారములేదు. అట్లుకలిగించుకొనుచుండినట్లంతా చిక్కులు బయలుదేరును. ఇట్టివిషయాలలో ప్రతివాడును బాగాఆలోచించి సరియైనదృష్టితో ప్రకృతపరిస్థితులను గమనించుచు పని చేయవలెను. తప్పుపట్టేఅట్లుఉండకూడదు. కాని విచారమేమనగా ఈప్రపంచములో అట్టిబుద్ధిమంతులే కరువైపోయినారు. దేశసమస్యలవిషయమై వారు సరియైనభావాలులేనివారై యున్నారు.

---

# మెజిస్ట్రేటుపై భార్య అభియోగము

సికింద్రాబాదు

శ్రీమతి డి పీ.దేవి అనునామె భారతసేవాదళము అను ఒకసంస్థను స్థాపించి అందు బాలబాలికలను విచారించుకొనుచుండెడిది. అట్టియామె సికింద్రా దు డిస్ట్రిక్టు మెజిస్ట్రేటుఅయిన శర్మగారిపైన భరణార్థము అభియోగమును తెచ్చియున్నది. ఆమెవాద మేమనగా "శర్మకును నాకున్నూ భార్యాభర్తలవంటిసంబంధము ౫-౬ ఏండ్లనుండి వర్తించుచువచ్చినది తత్ఫలితం శర్మవలన నాకుఒకకుమారుడుపుట్టినాడు. వానికి గోపాలశర్మఅను నామకరణముచేసినాము. వాడు ౫ఏండ్లవయసువాడు. కావున శర్మచేత నాకు భరణార్థమిప్పించవలెను"

ఈమెపక్షాన వాదించుటకు ప్రసిద్ధులైన బొంబాయివకీలు అజాదుగారున్నూ బాపట్ల కాళీదాసువకీలున్నూ రానున్నారు. స్మిత్ మెజిస్ట్రేటుగారియెదుట సికింద్రాబాదులో విచారణ జరుగును

---

# ఆర్యసమాజ వార్షికోత్సవము

### ముఖ్యుల సుభాషితములు

మిర్యాలగూడెం ౭-౯-౫౦ ఫ.

శ్రీయుత జె. ఆదినారాయణగుప్త వకీల్, ప్రధాన్ ఆర్యసమాజము మిర్యాలగూడెంగారి ఆధ్యక్షతక్రింద ఆర్యసమాజము మిర్యాలగూడెం ప్రథమవార్షికోత్సవము ఈసంవత్సర జేష్ఠ బ॥ ౧, ౨లు మంగళ, బుధవారములయందు మహావైభవముగ, దిగ్విజయముగ జరిగెను.

మంగళవారంనాడు ఉదయం ౯౹౪కు దేశభక్తులగు, మరియు హైద్రాబాదు ఆర్యసమాజ ప్రధానులగు శ్రీమాన్ వినాయకరావు విద్యాలంకార్, బారెట్లా గారికి ప్రధానులయిన శ్రీయుత జె. ఆదినారాయణగుప్త, వకీలుగారు తమసమాజపక్షమునుండి ఘనమగుస్వాగతమొసంగిరి- మరియు వారివెంటవిచ్చేసిన పండితవర్యులు, శ్రీమాన్ బన్సీలాల్ వ్యాస్‌జీ (భజనిక్), మహేంద్రప్రతాప్, మంత్రిప్రగడ వేంకటేశ్వరరావుగారలు యథోచితముగాసత్కరింపబడిరి.

స్థానికసమాజమువారిచే నిర్మింపబడిన సభామండపమునందు పైరెండురోజులు ఉదయము, సాయంకాలములందు హవనముజరుపబడెను మరియు పైపండితవర్యులుగాక, ఇంకను పండిత భద్రదేవుజీ, ప.డిత హనుమంతరావుజీ మొదలగువారు వైదికధర్మమునుగురించి మిగులమనోరంజకముగ ఉపన్యసించిరి, ఆర్యసమాజముయొక్కముఖ్యోద్దేశము విశ్వమానవకళ్యాణమనిచాటిరి పండితవర్యులును, పూజ్యులగు వినాయక్‌రావు బి ఏ. బారట్లగారు రెండవరోజు ౯ వ యం ౧ గంటలకు ఓంపతాకారోహణము సభాసదులకు దివ్యమగుసందేశమొసంగుచు సలిపిరి. రెండవరోజుసాయంత్రం ప్రధానులయిన శ్రీయుత జె; ఆదినారాయణగుప్త వకీల్‌గారు ఆర్యసమాజ ముఖ్యోద్దేశము విశ్వభ్రాతృత్వము విశ్వమానవకల్యాణమనిసెలవిచ్చుచు, ఈసమాజమున కాధారభూతము సత్యమని చెప్పిరి.

అపిమ్మట కార్యదర్శులగు శ్రీయుతతిర్నగిరి రాములు గుప్తగారు సమాజనివేదికను చదివివినిపించి. మానవునిజన్మ సార్థకతకు ఆర్యసమాజమే శరణోపాయమనియు- సమాజోద్ధరణకు ఎల్లరు తోడ్పడవలెనని తెలిపిరి. తరువాత ప్రధానులయిన శ్రీమాన్, జె-ఆదినారాయణగుప్త వకీలుగారు ఇప్పుడు ప్రపంచములో దాదాపు మూడవభాగము యుద్ధమునందు మునిగియున్నదనియు, చాల విషాదపరస్థితిగ నున్నదనియు, ఇట్టి సమయమున మనమంతరము మహాఘనతవహించిన, దయామయులగు నిజాంప్రభువరేణ్యుని చల్లని ఛాయాఛత్రముక్రింద మిగులశాంతముగ జీవనముచేయుచున్నామనియు వారికివారిసటుంబమునకు భగవానుడాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి కలుగచేయుగాకయని ప్రార్థింప సభాసదులందరు ప్రార్థన సలిపిరి.

### పై సభలోని సుభాషితములు

"స్వామిమహర్షి దయానందసరస్వతి సత్యధురంధరులు త్యాగి" ఆర్యసమాజము ప్రపంచోద్ధరణకైస్థాపింపబడినది ఓంకారజండాక్రింద జాతిమతభేదములులేవు, దీని చెంతజేరినవారినెవరినైనను రక్షించుట ఆర్యవీరుని పరమధర్మము.

వినాయక్‌రావు, బారెట్లా

ఈవిశ్వము తటికి మూలాధారముసత్యము, ఆర్యసమాజమునకాధారభూతము సత్యముదీనిలో జాతిమతభేదములు లేవు, ఈప్రపంచమంతయు ఆర్యమయముకాదగును. విశ్వభ్రాతృత్వము, విశ్వమానవకల్యాణమే సమాజఆదర్శముకావున నే మహర్షి దయానందసరస్వతి తనజీవనమంతయు దీనికిధారబోసెను.

సభాధ్యక్షులగు శ్రీయుత జె.ఆదినారాయణగుప్త వకీల్

మాధవివ్యాసముల అంతరింపచేసి, సత్యాసత్యవిచక్షణచేసి ధర్మోన్నతికై సమాజోద్ధరణకై పాటుపడుటయే మానవునిపరమధర్మము;

స్వామి బన్సీలాల్ వ్యాస్‌జీ,' భజనిక్‌గారు

ఈనగరియందున్న హిందూజాతి పునరుద్ధరణకు కారణము హిందూజాతి నయనపవిత్రతయే దుర్మార్గులకు జంకబనిలేదు.

పండిత మహేంద్రప్రతాప్‌గారు

ప్రపంచములో మతములలోకెల్ల ఆర్యసమాజము పరమపవిత్రమైనది దీనినిఉద్ధరింపుడు.

పండితభద్రదేవుజీ ఉపదేశము వల్లగొండ

ఆత్మబలము అన్నిబలములలోకన్న శ్రేష్ఠమైనది" శ్రీమాన్ మంత్రిప్రగడ వెంకటేశ్వరరావుగారు.

మానవోన్నతికి మూలము బ్రహ్మచర్యపాలన వీర్యరక్షణయే' పండితహనుమంతరావు ఉపదేశకు సూర్యాపేట

మానవునిజన్మతరించుటకుమూలము ఆర్యసమాజముదప్ప వేరొండులేదు. శ్రీయుత తిర్నగిరి రాములుగుప్తగారు

ఇట్లు
పాశేపల్లి యలమందఆంధ్రగ్రంథాలయ
కార్యదర్శి మిర్యాలగూడ

---

# ఈరానీలను వెళ్లగొట్టు ఆజ్ఞ

౧౬ జూన్

ఏ-పి-ప్రెస్సువార్తయొకటి యిట్లుతెలుపుచున్నది:

నిజాంరాష్ట్రములో కొన్నిజిల్లాలలో ఒక ఈరాని బలూచీగుంపువచ్చి దుష్ప్రవర్తనలు చేసినట్లు స్థానిక పరస్థానికపత్రికలలో వార్తలు ప్రకటింపబడియుండెను అట్టిఈరానీగుంపును వీలైనంతతొందరగా రాష్ట్రముబెలుపటికి వెళ్ళగొట్టుటకు ప్రభుత్వమువారు ఆజ్ఞనుచేసియున్నారని రూఢిగా తెలియవచ్చినది.

---

# ఆంధ్రమహాసభపేరు మార్చుట

## లేక సానుభూతి తీర్మానము నంగీకరించాలి

(సునర్ల శ్రీరామ నృసింహం పంతులుగారు)

చిలుకూరు ఆంధ్రమహాసభనుగురించి విమర్శించుటకు నాకు యిరువదిసంవత్సరములనుండి పరోక్షసంబంధము హైదరాబాదు ఆంధ్రోద్యమముతో కలదని మొదటనువవిచేయుచున్నాను.

చిలుకూరిసభలోని యితరతీర్మానములనుగురించి నేనువిమర్శించను. కాని ఆంధ్రమహాపురుషులైన శ్రీజయంతి రామయ్యపంతులు, గిడుగు వెంకటరామమూర్తి పంతులు, న్యాపతి సుబ్బారావు పంతులుగార్ల మరణమునకు సంతాపము తెలియజేయుచు భాగమును విడిచించుటయు నిరాకరించుటయు ఆక్షేపణీయముగనున్నది. ఎందుఅకు యీ ముగ్గురు నాయకులనుతో అగించిరి? వారు హైదరాబాదురాష్ట్రమువారుకాదనియా?

హైదరాబాదు రాష్ట్రాంధ్రమహాసభ తెలంగాణా తెలుగువారి సర్వతోముఖాభి వృద్ధికై ఏర్పడినది. అయితే సదరుఅంధ్రమహాసభకు యితరప్రపంచముతో సంబంధముయుండకూడదన్న మాటయా? భారతవర్షములో వివిధప్రాంతములలో యున్న సాంఘికఆర్థిక సారస్వత వికాసపరిణామములతో యీసభయోచనను పెట్టుకోనవదన్న మాట. చివరకు ఆంధ్రరాష్ట్రములోని ఆంధ్రభాషాభివృద్ధినిగురించికూడ ఆలోచించవదన్న మాట.

తీర్మానము ఆంధ్రరాష్ట్రములోని ముగ్గురు ఆంధ్రప్రముఖుల మరణసంతాపమునకు! వారిలో మొదటివారు ఆంధ్రభాషకు ప్రధానాధారమైన ఆంధ్రసాహిత్యపరిషత్తును ముప్పదిసంవత్సరముకై స్థాపించిపోషించినమహామహులు రామయ్యపంతులుగారు. రెండవవారు ఆంధ్రభాషకు అపారసేవచేసి వ్యావహారికభాషావాదమును ప్రారంభించి ప్రచురించబడినప్రచారముచేసి వ్యాపకములోనికి తెచ్చిన రామమూర్తిపంతులుగారు. రామయ్యపంతులుగారు భారతశాసనసభాసభ్యులైయుండి ప్రథమమున ఆంధ్రరాష్ట్రతీర్మానమును ప్రతిపాదించియుండిరి. ఆంధ్రులమనస్సులను ఝల్లుమనించునట్లు రామమూర్తిపంతులుగారు నూతనఒరిస్సారాష్ట్రనిర్మాణసందర్భములో వారిస్వగ్రామము పర్లాకిమిడిని, అక్రమముగ ఓఢ్రదేశములో కలుపుచుండగా రాష్ట్రమువిడిపోవుకోజు అర్ధరాత్రిసరిగా ౧౨ గంటలకు అవియోగ్యుడుడు, ఆ భాషాసింహము వారికత్యంతప్రియమైన పర్లాకిమిడిని శాశ్వతముగవిడనాడి మహేంద్రతనయ ఏరుదాటి ఆంధ్రరాష్ట్రములోని పాతపట్టణమునచ్చిన మహానుభావుడు. వారిజీవితములోతిరిగి పర్లాకిమిడిలో కాలుబెట్టనిపౌరుషవంతుడు రామమూర్తిపంతులుగారి యీకార్యము ఆంధ్రులను కదలించివేసెను. నన్నయార్యుడు తణుకు (పశ్చిమ గోదావరి) వాడనియు, తిక్కనసోమయాజి గుంటూరు నెల్లూరివాడనియు వారిరచనలను తెలంగాణావారునిరాకరించుట ఎట్లుండునో రామయ్యపంతులు, రామమూర్తిపంతులుగార్లను సంస్మరింపకుండినఅట్లుండును. ఈజిప్టు, టర్కీ, ఇరాను, ఇరాకు ఆఫ్ఘనిస్థానములలో అరబిక్ పర్షియను కవులు హైదరాబాదులో ఆదర్శపురుషులుగా ఆచటిఉర్దూభాషావేత్తలు పరిగణించుచుండుటలేదా? అటులనేఆంధ్రరాష్ట్రములోని భాషావేత్తలను హైదరాబాదులో ప్రశంసించుటతప్పా? ఆదరించుటతప్పా? లేక సంస్మరించుటతప్పా?

రామయ్యపంతులు రామమూర్తిపంతులుగార్లకు సానుభూతిచూపిన హైదరాబాదుప్రభుత్వము ఆగ్రహపడునవుకొనిరా? ఆదోరతనమునకు ఏతీర్మానము నెట్లుగ్రహించవలెనో తెలియదా? అయిదరిభాషోద్ధారకులవిషయమై లోపించుట సంకుచితదృష్టిప్రబలినదని నానిశ్చయాభిప్రాయము. భాషకు రాజకీయసరిహద్దులుండవు. తంజావూరు జిల్లాలో తిరువయ్యారుకుబుట్టిన శ్రీత్యాగరాజు ఆంధ్రభాషను సంగీతరూపమున అంతరిక్షమార్గమునకెత్తివేసెను. అరవదేశములోబుట్టిన త్యాగయ్య మాతృభాషాభిమానముచేత నేకదా ఈశ్వరలీలలను ఆంధ్రములో గానముచేసెను!

ఇక శ్రీన్యాపతి సుబ్బారావుపంతులుగారి నామముతీర్మానములో నంగీకరింపవచ్చునారాదా? సుబ్బారావుపంతులుగారు నిజముగ రాజకీయవేత్త, అఖిలభారతకాంగ్రెసుకు అయిదుసంవత్సరములు ప్రధానకార్యదర్శిగా నాయకత్వము వహించిన ఆంధ్రభీష్ముడు. ఆయన ౧౯౪౧ సం॥లో కాలధర్మమునొందెను. చిలుకూరి సభాతీర్మానములో ఆయనరాజకీయప్రజ్ఞనుగురించివివరణలేదు. ఆంధ్రులలో గొప్పవారల మరణసంతాపనామములలో సుబ్బారావుగారిపేరుకూడ చేర్చిరి. ఇది యుండుట ఆక్షేపణీయముకాదని నాఅభిప్రాయము. ఆంధ్రమహాసభలో రాజకీయములనుగురించి చర్చించకపోవచ్చును. కాని సుబ్బారావుపంతులుగారి సానుభూతిలో రాజకీయమేమియున్నదో బోధపడదు.

౧౯౦౮సం॥ము వందేమాతరములో తీవ్రరాజకీయవాదియైన అరవిందయోగినిపుడు చేరి ఒల్లి ఎన్నిశేలమంది సంస్థానములలోనిప్రముఖులు సందర్శించుటలేదు? ఉదాహరణకు ప్రధానిసర్. హైదరీగారు ప్రతిసంవత్సరము ఆమహావేదాంతివద్దకు వెడలి వేదాంతామృతమును గ్రోలుటలేదా? ఇట్లా ఎన్నినిదర్శనాలో రాష్ట్రీయసంస్థాన ప్రముఖుల అన్యోన్యగౌరవభావమును ప్రదర్శించునవి చూపవచ్చును

అదీకాక, తీర్మానము పట్టాభిసీతారామయ్యగారిశాసనోల్లంఘన వాభిప్రాయము గురించి కాదు, ప్రకాశంపంతులుగారి శాసనసభా కార్యక్రమమునుగురించికాదు. అన్నపూర్ణయ్యగారి సామ్యవాదమునుగురించికాదు. గాంధీ, పటేలు, సరోజనీదేవి, అబ్దుల్ కలామజదువంటి నాయకులతో సమానప్రతిష్ఠగల సుబ్బారావుపంతులుగారు కీర్తిశేషులైనందులకు సానుభూతి. ఈతీర్మానములోకూడ సుబ్బారావుగారి రాజకీయప్రవృత్తి ఎట్టిదను వివరణలేదు.

హైదరాబాదురాష్ట్రము తద్రీత్యా తెలంగాణము భారతవర్షములో అంతర్భాగమని మరచిపోతే ఎట్లాగు? భారతసమాఖ్యను హైదరాబాదుప్రభుత్వమే అంగీకరించుచున్నదే సమాఖ్యఏర్పడును? భారతరాజకీయనాయకులు, సంస్థానప్రజానాయకులకును ప్రత్యక్షసంబంధ మేర్పడినప్పుడే, సంస్థానప్రజలు, రాష్ట్రీయప్రజలు ఒకరినొకరు గౌరవించుకొన్నప్పుడే. సంస్థానప్రజానాయకులను రాష్ట్రీయనాయకులును పరస్పరము, గౌరవము చూపుకొన్నప్పుడే సంస్థానప్రజలు భారతనాయకులను గౌరవించినపుడే.

సుబ్బారావుపంతులుగారు భారతనాయకులైనను మితవాదులనిప్రఖ్యాతి. ౧౯౧౭సం॥తో పంతులుగారు కాంగ్రెసుతో ప్రత్యక్షసంబంధమువదలుకొన్నారు. ౧౯౧౭కుపూర్వము మహమ్మదాలీజిన్నా మహమ్మదాబాదురాజా సర్ సి.పి. రామస్వామయ్యరు, సర్ కె.వి. రెడ్డినాయుడుగారలతో సుబ్బారావుగారు రాజకీయములను నడిపించినవారే. అట్టిమితవాదనాయకుని హైదరాబాదుప్రభుత్వమే గౌరవించునే!

ఎటులైనను ముప్పురిఆంధ్రముఖుల నామముల సానుభూతి తీర్మానమునిరాకరించుటలో గొప్ప పొరబాటేజరిగినది. తెలంగాణాపుఆంధ్రమహాసభ చరిత్రలోయిదియొక కళంకమువుట్టమని చెప్పసాహసించుచున్నాను. ఇట్లనుటచే ఆంధ్రరాష్ట్రరాజకీయములతో సంబంధముపెట్టుకోమని కోరలేదు. ఆంధ్రరాష్ట్రనిర్మాణవిషయమై ప్రోద్బలపరుచుమనివాంఛించలేను, హైదరాబాదురాష్ట్రాంధ్రులను, ఆంధ్రకవులను పండితులనుప్రముఖులను గౌరవించుటలోతప్పేమి? స్వర్గస్థులైనతర్వాత సంస్మరించుటలోయున్న చిక్కేమి?

జయంతి రామయ్యపంతులు గిడుగు రామమూర్తిపంతులుగార్లను సంస్మరించలేనిసభ ఆంధ్రమహాసభయనిపించుకొనునా? రెండుకోట్లకెబ్బదిలక్షలఆంధ్రులు ఆభాషావేత్తలనుమరచిపోవుట సమంజసమగునా? హైదరాబాదు తెలుగువారు ఆంధ్రమహాసభపేరైనా మార్చుకోవలెను, లేక ఆసానుభూతితీర్మానమును మండలసభలలోను స్థాయిసంఘములోను తిరిగిప్రతిపాదించుచు వచ్చేమహాసభలో ఆమోదించవలెను. ఈతీర్మానమును నిరాకరించుట ఆంధ్రత్వమునకులోటు. ఆంధ్రనాయకులవిషయమై తీవ్రాలోచనగావించి తీర్మానమును పునఃప్రతిపాదింపజేసి ఆమోదింపజేయుట ఆంధ్రప్రతిష్ఠయగును

సంస్థానప్రభుత్వములు రాజకీయోద్యమములను హర్షింపనప్పటికిని, సహింపనప్పటికిని భారతరాజకీయనాయకులను ఆయాసులను గౌరవించియుండిరి. మైసూరులోను, తిరువాన్కూరులోను గాంధీమహాత్ముడు సంస్థానప్రభుత్వఅతిథిగానుండెను, మైసూరుకాంగ్రెసుఅందోళనలో రాజీచేయుటకుగాను వల్లభాయిపటేలుగారుగా ఆయనప్రభుత్వఅతిథిగానుండెను. సరోజనీదేవి [illegible] బహద్దరు సప్రూమున్నగునాయకులు హైదరాబాదు[illegible] ప్రభుత్వాధికారులతో రాజకీయసంప్రతింపులుచేసియుండిరి. లండనులోజరిగిన రౌండుటేబిల్ సభలలో సర్. అక్బరు, సర్. మీర్జాయిస్మాయిల్, సర్.సి.పి రామస్వామయ్యరువంటివారు సంస్థానప్రధానులుగాంధీ పండితమాలవ్య, చింతామణి, మరియున్నగు భారతనాయకులతో రాజకీయసమస్యలనుగూర్చి వితర్కింపలేదా? భారతసమాఖ్యను సంస్థానములుసమర్థించినకోఅదియు రాష్ట్రములు లేనిసంస్థానములు లేను [illegible] పోవుచున్నది. సంస్థాన ప్రభుత్వములవారికూడ విశాలరాజకీయము అలవాటగుచున్నది.

## మోహన్. వీ. రాజుగారు

సికింద్రాబాదులో పుట్టిపెరిగిన మోహన్ వీ. రాజుగారు ౧౫ ఏండ్లక్రిందట సికింద్రాబాదును వదలివెళ్లియుండిరి. వారుగతవారము తిరుగ సికింద్రాబాదుకువచ్చిరి, వారు బహుకాలము అమెరికాలో ఉండిరి వారుసికింద్రాబాదులోని సెంట్ మేరీస్కూలులోను మహబూబుకాలేజిలోను విద్యాభ్యాసముచేసియుండిరి. వారు బొంబాయి నుండి ఇండియన్ వాయిస్ అను ఆంగ్లమాసపత్రికను నడుపుచున్నారు. దానికి లేడీలిన్లిత్గో గారు ముఖ్యపోషకులైయున్నారు.

"నేను మళ్ళీ నాబాల్యదశలో కాలంగడపిన సికింద్రాబాదువచ్చుటకు చాలా ఆనందించుచున్నాను. నేను లండనులో ఉండినాను. అమెరికా తిరిగివచ్చినాను. ప్రపంచమంతా తిరిగివచ్చినాను. కాని నాసికింద్రాబాదేనాకు ఆనందం ఇస్తుంది" అని వారు వచ్చినతోడనే అన్నారు. ఇంకాఇట్లన్నారు- నేను బ్రిటనులో ఉండగా అమెరికావారు హిందూస్థానీలంటే సహించరని యెవ్వరో అన్నారు- కాని నేనాదేశం పోయినపుడు అందరూనన్ను ప్రేమించినారు. ఇండియాలో మహావానికేఅధికారముంది. అమెరికాలో స్త్రీకే అధికారాలున్నవి. అమెరికా స్త్రీలకు పురుషులు లోబడినారు. అయితే అవసరంకొద్దిఅచ్చటి స్త్రీలను పురుషులకువిధేయులై యుందురు. అచ్చటి స్త్రీలు అన్ని వ్యవహారాలలో పాల్గొంటున్నారు, అచ్చట కుమారుగకోటిమంది స్త్రీలు ఏదో యొకఉద్యోగం చేయుచున్నారు. అమెరికాలో స్త్రీలుపురుషులతో ప్రతిఉద్యోగంలో పోటీ చేయుచున్నారు. తుదకుఅచ్చటిపురుషులు వంటచేయుట అంట్లుతోముట పిల్లలపెంచుట యీపను లకుదిగుచున్నారు. ఇక్లేకాలంగడిస్తె అక్కడను గవారు, అదహాకాశారు అవవారుమగవారౌతారు. రాజుగారు అమెరికాలో వ్యవసాయకళాశాలలో డిగ్రీపొందినారు. ఎం.ఏ. డిగ్రీకూడా పొందినారు.

---

## సాధువుఅదృశ్యమైనవింత

౧౧-౬-౪౧

పాలకంచతాలూకా దమ్మపేటఅనేగ్రామంలో నిన్న సాయంత్రం అవగా ది ౧౦-౬-౪౧ తేదీన చవ్వారాజయ్యఅనేషాహుకారు- తనవరి పొలందగ్గరకువెళ్లాడు కండెన్నరఎత్తు, మూరెడుగడ్డం(తెల్లది)కాషీవధారి, చంకలోజోలిగల ఒకసాధుగారు, సదరు షాహుకారుదగ్గరకువచ్చి "ఏమండీషాహుకారుగారూ మీకుమామిడిపండ్లుకావాలా" అనిఅడిగారు "కావాలని" ఆషాహుకారుచెప్పాడు అప్పుడు తనజోలిలోనుంచి రెండుమామిడికాయలు ఒకటిపచ్చిది రెండవది పండుయిచ్చాడు వాటితీసుకొని రగఖములదూరమువచ్చి వెనుకకుచూచాడు. ఆసాధుగారుఅంతర్ధానమైనారు- ఆప్రదేశంచుట్టూ దాదాపురెండుమూడుఫర్లాంగులవరకు చిన్నచెట్టయినాలేదు. అంతా బయలుప్రదేశం—పరుగెత్తుతాడా, అంటే యీనిమిషంలో ఎంతదూరంపరుగెత్తగలడు- ఈ సంగతి ఆశ్చర్యమేసింది. షాహుకారుయింటికివచ్చేసరికి చీకటిఅవుటవల్ల పండుమామిడికాయ కోసితిన్నారుభార్యాభర్తలు. చాలాతియ్యగావున్నటులుచెప్పారు- ఉదయం పచ్చికాయ తీసికొనివచ్చి గ్రామంలోపెద్దలకుచూపాడు- కథంతాచెప్పగా చాలాఆశ్చర్యమైంది- పచ్చికాయపరీక్షించగా ఇప్పుడే కోసి తెచ్చినదిట్లుంది.

యీగ్రామానికి చుట్టుప్రక్క—అంతా ఎక్కడకూడామామిడిచెట్లకు కాయలు లేనేలేవు-అకాయచూచుటకు చిత్రముగానున్నది- గనుక పాఠకులంతా యీవిషయమును శ్రద్ధతోగమనించి పాపం ఆషాహుకారుకు ఏమిఫలంజరుగుతుందో, వ్రాయించకోర్తాను-

ఇట్లు

యన్. వెంకటసుబ్బారావు.

---

## ౫౦ వేలు ఇండ్లులేక అల్లాడుట

ఇటీవల రోహిణికార్తిలో మలబారుమండలములో చెప్పరానట్టి గాలివానతుపాను కలిగినందున ౫౦౦౦౦ మంది ఇండ్లులేక అల్లాడుచున్నారు. అనేకస్థలాలలో ఇండ్లుకూలిపడెను. వీధులంతా జలప్రళయంగానున్నందున పడవలు తెచ్చి వీధులగుండాప్రవహించుప్రవాహములలో వాటినినడిపి అపాయస్థితిలోనున్న జనులను వేరుచోటికి తీసుకొపోవలసివచ్చెను. కాలికట్టులో రోడ్లు రైల్వేలు నీటిలోమునిగియున్నవి- జనులకు చాలా నష్టం కలిగింది.

---

## తెలివిలేనిమందికి ఆయాసం ద్రవ్యనష్టం

మూర్ఖవిశ్వాసాలకు అంతులేదు

కొద్దిదినములక్రిందట తా॥ సిద్దిపేట మా॥ చిన్నకోడూరమ్మగ్రామంలో. ఒకమోటభావివద్దఒకయీతచెట్టు రాత్రియంతను భూమిపై దినమంతయుధారీతి మెల్లమెల్లనలేచినిలబడుటం జరీగిజరుగుతుందని ఒకపత్రికాప్రకటన చూచియుంటిని నేను చం॥ ౪ తేదీనఅచ్చటికవెళ్లి యీసంగతియెంతనిజముకావచ్చునని,ఒకదినముపూర్తిగఉండిచూచితినికాని యేలాంటిమార్పులేదు- యెన్నడోగాలికి ఆయీతచెట్టు వేర్లతోసహా వంగిపోయి భూమికిగజంయెత్తునఆగియుండి గాలివీచిన కొలది కాస్తవంగుటంలేచుటంమాత్రం జరగటంసాధ్యమౌ. ఇంతటికేచాలాప్రజలు దూరదూరమునుండి ఆయాసప్రయాసలకోర్చి విరివిగావచ్చుచున్నారు- కోళ్ళుగొర్లు విస్తారంగబలియౌతున్నవి- యేమిలేకున్నా చుట్టుపట్లగ్రామాలలోప్రజలలో మూఢనమ్మకాలు చెలరేగుతున్నాయి- నిన్న నేడుమాత్రం కాస్తసందడి తక్కువైంది- (ఓ-వి)

---

## చిట్యాల దేవునివద్ద పూజారుల కాఠిన్యము

చ౫ అమర్దాదు ౧౩౫౦ ఫ.

ఒక బీదహరిజనుడు చిట్యాల దేవునిమహిమవిని యీ దేవునిదర్శనార్థమైవచ్చి, ఒకపైసదేవునికి అర్పించుటకై దేవాలయములోనికి ప్రవేశింపబోయెను. దేవాలయముయొక్క నాల్గువైపుల వెదురుబొంగులఆవరణంకట్టివున్నారు. పాపముఆదీనుడు దానిలోపలికిప్రవేశించుటకై గేటువద్దకురాగా, ఒకపూజారిదేవునివద్దనుంచి పరుగెత్తివచ్చి, నీవు హరిజనుడవు, నీచుడవు, అనిబూతులుతిట్టుచు దెబ్బలుకొట్టెను. పాపమాహరిజనుడు, ఆలియక లోనికిప్రవేశింపజొచ్చితినని క్షమాపణగోరెను. పం పురుషుడైనా తెలియకవచ్చెనుకాబట్టి విడచిపెట్టుడుఅనిరి. తుదకు హరిజనుడిట్లువిలపించెను. దేవుడా, నిన్నుచూతామని చాలాదూరమునుంచి శ్రమపడుచువచ్చినందుకు యిట్టికష్టమునకుగురియైతిని. నీమహిమ నాకుచూపకపోతివికదా. ఇంకేమినేను వచ్చినదారినేపట్టుకపోతానుఅని విలపించుచువెళ్లిపోయెను.

---

స్వఘ సోదరులకు

## రెడ్డి జనసంఘ రజతోత్సవ వర్గమువారి విజ్ఞప్తి

ఇదివరలో ౭వఅమర్దాదు౧౩౫౦ఫ గురువారమునాటి గోలకొండపత్రికలో రెడ్డిజనసంఘస్థాపన అయి ౨౫సంవత్సరములునిండినందున రజతోత్సవము౧౩౫౧ఫ ఆజార్ నెలలో చేయవలెననియు, అంతలోపలకనీసము (రూ॥౫౦,౦౦౦/) యాభై వేలరూపాయిలుఅయిన రెడ్డిజనసంఘమూలనిధికి సమకూర్చవలెననియు విజ్ఞప్తిని ప్రకటించియుంటిమి, అభిమానులందరును తమవిరాళములను, ఈ క్రిందివిలాసమునకుపంపవలెనని మనవిచేసుకొనుచున్నాము. తమప్రాంతాలలో ద్రవ్యసహాయముజేసి, చేయించుటకు ఉత్సాహముకలిగినవార దరును మాకుతెలిపినట్లయిన ఇచ్చటనుండి కొందరిముఖ్యులను తమసేవలోకిసంపుకొనగలము. ఈకార్యమును సోదరులందరును తమసొంతపనిగాభావించి అభిమానముతో సహాయపడుదురని ప్రార్థించుచున్నాము.

ఇట్లు

ఆర్. దామోదర రెడ్డి
బారిస్టరు. కార్యదర్శి
రెడ్డిహాస్టలు సుల్తానుబజారు,
హైద్రాబాదు (దక్కను)

---

## అష్టమాంధ్ర మహాసభాధ్యక్షులగు శ్రీరావినారాయణ రెడ్డిగారికి స్వాగతపత్రము

మహాశయా!

దయామయప్రభుత్వముతగినన్ని శాసనములుకల్పించినను, మఖ్తాజాగీరులలోగల. మావంటి దరిద్రప్రజలు, తరతరములనుండి అనుభవించుచున్న నికృష్టజీవితమునకు. శుభోదయము కలుగునను ఆశకలిగిన మాచేతవోలుమఖ్తాప్రజలు మీకు హృదయ పూర్వకముగ స్వాగతమొసగుచున్నాము.

కృపాగుణభూషణా!

యౌవనులయ్యు ప్రజాభిమాన గౌరవములచూరగొనిన విశిష్టజీవనులగుటకు, మీఆంధ్రమహాసభ అధ్యక్షతయే, నిదర్శనము,

స్వార్థత్యాగ పరాయణా!

త్యాగులును, దేశారాధకులును, నగు మీదర్శనభాగ్యమునకు, ఈబీదజనులు,పొంగుచున్నారు,

ప్రజాహితకార్యధురంధరా!

ఖాల్సాప్రజలకన్న అధోగతి పాలుజేయబడినమాకు, మీమహోన్నతమగు భావికార్యక్రమము, తారకమంత్రము గాక!

యోధాగ్రేసరా!

మీజాతి మతద్వేషములేని, ఉత్కృష్టదేశారాధనము, మానవసేవాపరాయణత్వమునకు, మార్గదర్శకము కూడు గుడ్డయను, (రెండే) దేశమునకు, ముఖ్యసమస్యలని మీఉద్యమమే చాటుచున్నది. దానినిసాధించుటె యోగ్యమార్గమగునని, మీమహదాశయము-

ధీశాలీ!

ఆంధ్రోద్యమమైనను. దేశప్రజలకు, కష్టములబాపుటకేయని, తలంచుచున్నాము,

దయానిధీ!

మీవిజయమున్న మాచేతవోలు పవిత్రవంతమయినది. మీదర్శనముమాకు విజ్ఞానధైర్య స్థయిర్యములకు, పునాదు ౨కల్పించినది,

శాంతమూర్తీ!

రాత్రింబవలు రక్తముక్కలుగూర్చి కష్టించి బతుకుమానిక్కరంక ప్రేమాతిశయమే, మీకు ఆరాధనకుసుమముగు గాక,

---

## ఆంధ్ర విజ్ఞాన గ్రంథాలయము

సదాశివ పేట

(విలేఖరి)

విషునామచైత్ర ౫॥౧౮నాడు ప్రథమవార్షికోత్సవ మతివైభవముగ జరిగినపిమ్మట- వైశాఖ ౫॥౧నాడు రాబోవుసంవత్సరమునకై యీక్రిందివిధముగ అధికారులెన్నుకొనబడిరి-

అధ్యక్షులు— మాడిశెట్టి వీరయ్యగుప్తగారు,
ఉపాధ్యక్షులు- మల్లికార్జున నారాయణగారు
కార్యదర్శి- నిజాంపురం సంగయ్యగారు.
స. కార్యదర్శి- వోదెల ఈశ్వరయ్యగారు.
కోశాధ్యక్షుడు- కటుకం నారాయణగారు.

(౧౩౩౭) గ్రంథములతోసహా గ్రంథాలయము నువదలి పూర్వపుకార్యదర్శిగారు విరమించిరి. గ్రంథాలయసంస్థాపకులగు శ్రీయుత బుచ్చి వెంకటేశ్వరగుప్తగా రిప్పటివలెనే పురోభివృద్ధి విషయములయందు సాయపడగలరని వాగ్దానము చేసిరి,

---

## గ్రంథాలయ పరీక్షలు

౧౯౪౧వ మాసములో ఆంధ్రదేశ గ్రంథాలయసంఘమువారు బెజవాడతాలూకా పటమట గ్రామములో నడిపిన గ్రంథాలయ శిక్ష౯. తరగతులవిద్యార్థులలో క్రిందిసంఖ్యలవారు గ్రం.థాలయ ప్రవేశికపరీక్షయందు ఉత్తీర్ణులైరి.

ఈపరీక్షలో రెండుభాగములుకలవు మొదటిభాగములో గ్రంథాలయనిర్మాణము, గ్రంథాలయనిర్వహణము, గ్రంథనిర్ణయము, ప్రత్యేకగ్రంథాలయసమస్యలు, వయోజనవిద్యఅనువిషయములును రెండవభాగములో రాజకీయము, అర్థశాస్త్రము. భూగోళము, వాతావరణశాస్త్రము, ఆంధ్రవాఙ్మయచరిత్ర, సంస్కృతివాఙ్మయ చరిత్ర, హిందీవాఙ్మయచరిత్ర, హిందీభాషఅనువిషయములును చేరియున్నవి.

మొదటితరగతి ౧౩, ౧౪. రెండవతరగతి ౨, ౩, ౭, ౯౧౨, ౧౬, ౨౦, మూడవతరగతి ౯మాత్రము: ౫, ౧౯ సంఖ్యలవారు మొదటిభాగములోమాత్రము కృతార్థులైరి-

పా. నాగభూషణం
కార్యదర్శి ఆం. దే. గ్రం. సంఘము

---

## చౌకరిటరన్ టికెట్లు

### పండర్ పూర్ ఆషాడ ఉత్సవము.

### 5వ జులై 1941

26వ తరగతిక్లాసులు మరియుబస్సుకలిసి చౌకరిటరన్ టికెట్లు, 26వ జూను 1941 మొదలు 6వ జులై 1941 వరకు, రెండుకోజాలుకలుపుకొని పండర్ పూర్ నకు, ౼టూర్ రోడ్ (యజ్. యస్.) మరియు లాతూర్ (బి. యల్.) రైల్వేస్టేషనులమీదుగా దిగువఉదహరించిన స్టేషనులనుండి వానికెదురుగానున్న చార్జీలప్రకారము ఇవ్వబడును.

| | | రు. | అ. | ప. | | | రు. | అ. | ప. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| జహీరాబాదు | ... | 7 | 4 | 0 | హిసోలి (దక్కను) | ... | 8 | 6 | 0 |
| మొహమ్మదాబాద్ బీదరు | | 6 | 11 | 0 | కాలిమనూరిరోడ్ | ... | 8 | 1 | 0 |
| బాల్కి | ... | 6 | 0 | 0 | బోల్దా | ... | 8 | 0 | 0 |
| కాల్ గుపూరు | ... | 5 | 12 | 0 | చోన్ డి | ... | 7 | 11 | 0 |
| కమల్ నాగర్ | ... | 5 | 10 | 0 | బాస్మత్ నగర్ | ... | 7 | 8 | 0 |
| ఉద్ గిర్ (నైజాం) | ... | 5 | 4 | 0 | పూర్న | ... | 7 | 4 | 0 |
| హరీ | ... | 5 | 0 | 0 | బాపార్ | ... | 8 | 13 | 0 |
| జానవాల్ | ... | 6 | 14 | 9 | ధర్మాబాద్ | ... | 8 | 12 | 0 |
| కరీపూర్ | ... | 5 | 1 | 0 | కారోలి | ... | 8 | 7 | 0 |
| పానగాన | ... | 5 | 3 | 0 | ఉమ్రి | ... | 8 | 4 | 0 |
| ఘాట్ సీదుర్ | ... | 5 | 6 | 0 | ముద్ ఖేడ్ | ... | 8 | 0 | 0 |
| పర్లివైజ్ నాథ్ | ... | 5 | 13 | 0 | నాన్ దేడ్ | ... | 7 | 10 | 0 |
| పర్భని | ... | 6 | 12 | 0 | లింబగాన | ... | 6 | 15 | 0 |
| సింగపూర్ | ... | 6 | 9 | 0 | మనవాత్ రోడ్ | ... | 7 | 4 | 0 |
| ఢోండి | ... | 6 | 8 | 0 | సైలు | ... | 7 | 7 | 0 |
| గంగాకర్ | ... | 6 | 5 | 0 | పాన్ తూర్ | ... | 7 | 13 | 0 |
| వార్దగాన | ... | 6 | 1 | 0 | జాల్నా | ... | 8 | 7 | 0 |

పిల్లలకు అర్ధచార్జి చేయబడును

ఈ టికెట్టులు 14వ జులై 1941 తేదీ అర్ధరాత్రి 12గం॥వరకు మాత్రమే చెల్లును.

ఇతర విషయములకు:—

చీఫ్ కమర్షియల్ మేనేజరు,
సికింద్రాబాదు
హెచ్. యి. హెచ్. ది నైజాంస్టేటు రైల్వే.

---

# బ్రిటిష్ బీహారులో ముస్లిం కుటుంబ ఘోర సంహారము

## గాంధీమహాత్ముని సందేశము

వర్ధాగంజ్, జూను౯

బీహారులో, ఎవరో దుర్మార్గులు అకారణంగా క్రూరంపూని, ముందే ప్లానుఏర్పరచుకొని ఒక మహమ్మదీయ కుటుంబమును నిశ్శేషంగా హత్య చేసినారు. అందులో ౩ ఏండ్ల బాలిక కూడ ఉన్నది. ఈవార్త వినినవెంటనే నాకు కలిగినలజ్జా దుఃఖము అపరిమితము. బీహారులో రాజేంద్రబాబు శాంతి స్థాపనకై చేసేప్రయత్నాలు చేస్తునే ఉన్నారు. అయినప్పటి క్రూరదుష్టకార్యాలు విజృంభిస్తున్నయంటే భారతీయులు రాక్షసులుగా పరిగణింపబడవలసివస్తుంది.

అహింసావిషయంలో నాశిద్ధాంతములమాట అటుదూరంగా ఉండినా, హింసావాదుల సిద్ధాంత ప్రకారంగానైనా యిట్టిఘోరదురంతాలను సమర్థించటం అశక్యమే ఉంటాను.

ఇట్టిరాక్షసకృత్యాలే విస్తారంగా జరిగేయెడల ఆధ్వనిజకాలంలో యీదేశమేవిధంగా ఉంటేదో ఆట్లాగేమారిపోయి స్వాతంత్ర్యలాభానికి మిక్కిలి ఆలస్యమవుతుంది భారతావని.

కనుక నేనిపుడు హంతకులకొక్క హృదయపూర్వకమయిన సలహాయిస్తున్నాను. ఏమంటే, ఈహత్యచేసినవారు వెనుకముందులాలోచింపకుండా తమంతట తామే అధికారులఎదుట బడి తమ తప్పును తెలియపరుచుకొని వారిచ్చేశిక్షకు పాత్రులు కాగలిగినట్లయితే తాను చేసినదానికి ప్రాయశ్చిత్తమును పొంది ఇక ముందువారికి కూడ దారిచూపినవారవుతారు. ఇట్లు చేసినట్లయితే తమకుతమదేశానికిజాతికీ అంటుకున్న కళంకాన్ని తుడిచివేసినవారవుతారు.

ఈహంతకులు కొంతకాలముఅధికారులనుండి తప్పించుకొని ప్రచ్ఛన్నంగా ఉండగల్గినా జీవితంలో ఎప్పుడో ప్రభుత్వపు బారిపడక తప్పదు. అప్పుడు తనతప్పును తానుఒప్పుకొన్నా ఒప్పుకొనకపోయి నాశిక్ష ననుభవింతప్పదు కనుక దాగి యింతనైచ్యం సంపాదించేకంటే నాసలహానుగమనించి ఇక ముందుఇట్టివి జరుగకుండునట్లు చేయుట జాతిధర్మము” అనియీజూనుకి నాడు గాంధిగారు ప్రకటించిరి.

## వైశ్య సమాజము

సదాశివ పేట

(విలేఖరి)

విక్రమనామసంవత్సర పాల్గుణ బ౹౹ ౧౫ నాడు సదాశివపేట వైశ్యులందరు శ్రీరామ మందిరములో సమావేశమై వైశ్యసమాజమునొకదానిని ఏర్పాటుచేసి దానిక్రిందివారి నధికారివర్గముగ ఎన్నుకొనిరి.

అధ్యక్షులు— శ్రీబచ్చురామన్న గుప్త గారు.

ఉపాధ్యక్షులు— శ్రీమాదిశెట్టి వీరయ్యగుప్త గారు.

కార్యదర్శి— శ్రీబచ్చు వెంకటేశ్వరగుప్త గారు.

కోశాధ్యక్షులు— శ్రీమల్లికార్జున నారాయణ గారు.

వైశ్యవర్తకులవద్దగల దేవాలయఫండు గూడ వైవారే ఎన్నుకొనబడిరి. బచ్చు వెంకటేశ్వరగుప్తగారి ప్రోత్సాహమువలన ఆతరువాత అసమావేశములుజరిగెను, వైశాఖబ౹౹ ౯ నాటి సమావేశములో సమాజముయొక్క ఆధిపత్యమున వైశ్యనిధి ౧౦౦౦౦రూ౹౹ విద్యార్థుల సహాయార్థం యొకటేర్పాటుచేయవలయునని యీక్రిందివిధముగ తీర్మానించుకొనిరి

ఇంతవరకు ౧౫౦౦ పదిహేనువందలచందాలు వ్రాయించబడెను, సమాజమునకు సభ్యుడైన ప్రతివైశ్యుడును మాసమునకు అణాలచందాను చెల్లించునట్లేర్పాటు చేయబడెను.

## ప్రభాత్

శాంతాహుబ్లీకర్ యొక్క అపూర్వభావప్రకటనము

ఇప్పుడు దిల్షాదుటాకీలో ప్రదర్శింపబడు ప్రభాత్ అనుటాకీ చాలాఉత్తమంగా ఉన్నది. ఎప్పటికినిజరిగే కొత్తపాత భావాలసంఘర్షణ యిందు నిరూపింపబడినది. తండ్రి పాతకాలం మనిషి “సనాతనుడు” కొడుకు కొత్తకాలంవాడు. కళాశాలలోని ఒకయువతిని ప్రేమించినాడు. ఆమెబీదపిల్ల. సనాతనతండ్రిధనికుడు తనకుమారునికి కోటీశ్వరునిపిల్లను పెండ్లిచేయగోరును. బాలికఅన్న “శేకారుకవి”, ఇంకొకకళాశాలవిద్యార్థి బాలికను ప్రేమించును. బాలికవాన్ని ప్రేమించదు. అందుచేతవాడు ఆప్రేమకు భంగముచేయును. ఈటాకీలో శాంతాహుబ్లీకరున్ను “నాంపల్లి”యున్ను ఇందు ప్రధానపాత్రలు—శాంతాహుబ్లీకరు చాలాఅందమైనది. దానికితగినట్లుగా అభినయంలో అరితేరినది, మంచిగాత్రముకలిగినట్టిది. శేకార్ కవిమాలాన మంచికడుపుబ్బ నవ్వించేహాస్యరసము ప్రకటింపబడినది—“నాంపల్లి”అంధ్రుడు పైగా హైదరాబాదు నాంపల్లివాడనివిన్నాము. ఇతడుభారతటాకీలప్రధానపాత్రధారులలోని ఉత్తములలో కొకడు. శేకార్ కవి,హుబ్లీకర్, నాంపల్లి వీరిముగ్గురియొక్క అభినయము చూచితీరవలసినది— ఈటాకీ అత్యంతానందదాయకముగా ఉన్నది.

సంవత్సరము చందా
౬ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥ చందా
౫-౮ ౦ శిల్లాగు
పత్రికలకు
వెల ప్రత్యేకము

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches the masses In the Dominions
Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

**Volume 16** | **Hyderabad-Dn** | **Thursday 19th June 1941** | **Number 14**

## బ్రిటిషిండియాప్రభుత్వము బహద్దరుయార్జంగు పక్షమట!

రయ్యతు పరిశోధన

స్థానిక రయ్యత్ ఉర్దూదినపత్రికలో ౧౬ జూన్ నాటిపత్రికలో "రాజకీయవిశేషములు" వ్రాసినాడు:

డాక్టర్ సర్ జియావుద్దీన్ అహ్మద్ అలీగడు విద్యాపీఠ వైస్ ఛాన్సలర్ గారు హైదరాబాదులో ప్రభుత్వాతిథిగా కొన్నాళ్లుండి వెళ్ళిపోయినారు. ఆతనిరాక ప్రత్యేకతకలిగియున్నది. ఇటీవల హైద్రాబాదులో రాజకీయపరిస్థితిలో మార్పుకొనుండెను. వీరిరాకచేత ఆదిమార్పు వచ్చకపోయినది.

ము-ఘు-వ-నిజాంప్రభువుగారు వివిధవర్గాల లోని సామరస్యముకొరకై యిచ్చిన విసిఫర్మానులవల్లనున దేశములో అత్యుత్తమవాతావరణ మేర్పడియుండెను. దీనినిబట్టి ఇత్తెహాదుల్ముస్లిమీన్ ఆస్యతులు అధికారవర్గము తమదృక్పథాన్ని మార్చుకొందురని తలపబడుచుండెను. కాని బట్టబయలుగా శ్రీము-ఘు-వ ప్రభువుగారి శ్రీవాక్యాలకు విరుద్ధముగా ఇత్తెహాదువారు కొలెంచి(సవాల్)వేసిరి. అందుపై ఇత్తెహాదు ప్లాట్‌ఫారంపై చర్యతీసుకొందురని అందరును అనుకొనియుండిరి. శ్రీప్రభువుగారిఫర్మానులగౌరవము జనులదృష్టిలో స్థాపించుటకై వీరిపైచర్య అవలంబింతురనితలచిరి. కానిసర్ జియావుద్దీన్ అహమ్మదుగారు హైద్రాబాదు ప్రభుత్వానికి న॥ బహద్దరుయార్జంగుగారికి బ్రిటిషిండియాప్రభుత్వమువారి సానుభూతికలదనియు అందుచేత హైద్రాబాదుప్రభుత్వమువారువారిపై ఏమిన్ని చేయకూడదనియు నచ్చచెప్పినారట. ఎట్లనగాయీయుద్ధకాలములో బ్రిటిషిండియాప్రభుత్వమువారు ఇండియాలో ఎచ్చటను ఏముసల్మానునుకూడా అసంతుష్టునిగా చేయుటకు ప్రయత్నించియుండలేదు. ఎంతవరకు ఇత్తెహాదుల్ ముస్లిమీనుసంఘానికి న॥ బహద్దర్‌యార్జంగు బహద్దరుగారు నాయకులుగానుందురో అంతవరకు దానికేమిన్ని చేయరు. డాక్టరు జియావుద్దీన్‌గారి యీసమాధానము చాలా సమంజసముగానున్నదని హైద్రాబాదు ప్రభుత్వమువారు తలచినారట. అందుచేత తూష్ణీంభావమువహింతురట. ఈవిషయంలో డాక్టరుగారు జనాబ్ జిన్నాగారితోను ఆలోచనచేసి ముందు చేయదగినవిషయమును నిర్ణయింతురట.

## తిరువాన్కూరులో కూడాబాల్యవివాహ నిషేధం అయింది

తిరువాన్కూరులో రెండు శాసనసభలున్నవి. ఆరెండింటిలోనూ బాల్యవివాహనిషేధశాసన మంగీకరింపబడినది. తిరువాన్కూరు మహారాజాగారు ఆశాసనమునుఅంగీకరించి అమలులోపెట్టుటకాజ్ఞాపించినారు, ఇకముందు తిరువాన్కూరు సంస్థానములో ౧౮ ఏండ్లలోపలి పురుషులకును, ౧౪ ఏండ్లలోపలి బాలికలకును వివాహముచేయకూడదు. అట్లుచేసినశిక్షవిధింపబడును. ౨౧ సం॥ లోపలివాడు బాలికను వివాహమాడితే ౧౦౦౦ రూ. వరకు జుర్మానావిధింతురు. అంతకంటె పెద్దవాడు అట్టిపెండ్లిచేసుకుంటే ౧౦౦౦ వరకు జుర్మానా, ౧ నెలవరకు జైలుశిక్షవిధింతురు శాసనవిరుద్ధముగ వివాహాలుచేసిన తల్లిదండ్రులకు సంరక్షకులకుగూడ శిక్షవిధింతురు.

## సత్యాగ్రహవార్తలు

ఇంతవరకు యు-పి-పరగణాలలో ౧౨౭ వేలమంది సత్యాగ్రహులు జెయిళ్ళలోనున్నారని కే-యం-మున్షీ గారు ప్రకటించినారు- గాంధిగారికి ౨ దినాలు జ్వరంప్రవర్తి వచ్చుచుండినది- ఇప్పుడువారుబాగుగాయున్నారు.

బొంబాయిలో ౧౬ మందికార్మిక నాయకులు అరెస్టుచేయబడిరి- అందులోముఖ్యులు, ౧ నింబకర్, ౨ మహమ్మదుషహేదు, ౩ జోగ్లేకర్, ౪ దంగేభార్యా, ౫ గోదావరి గోఖలేకన్యయు చేరియున్నారు-

మదరాసులో ఆలీపురం, బళ్లారి, జైళ్ళలో కొందరు సత్యాగ్రహఖైదీలు ఉపవాసవ్రతమ్మొకట్టినందుకు శిక్షింపబడినారు- డాక్టర్ భగవానుదాసుగారు చాలాప్రమాదస్థితిలో ఉన్నందున వారికుమారులగు శ్రీప్రకాశ్‌గారినితండ్రినిచూచుటకు జైలునుండివదలినారు: ధీ నవరంలో చింతలపూడి వెంకట్రాజుగారివద్ద కమ్యూనిస్టు కరపత్రములున్నవని అతనికి ౧౮ నెలలకఠినశిక్ష విధించినారు-

మదరాసులో రెయిగ్యూరుకోర్టులో ౩ గురు సత్యాగ్రహులకు శిక్షలువిధింపబడినవి-

నెల్లూరుజిల్లాలో బొమ్మారెడ్డిగారికి కుడుగంటిరాఘవరెడ్డిగారికి సత్యాగ్రహముచేసినందుకు శిక్షలువిధింపబడినవి-

### వేసంగిపాఠశాలల నిషేధము

మదరాసు ప్రభుత్వమువారు తమరాజధానిలో వేసంగిపాఠశాలలపేరుతో కమ్యూనిస్టుప్రచారముచేయుచున్నటులు తెలుసుకున్నారు గనుక, అందుచేయికముందుజిల్లామేజిస్ట్రేటుఅనుమతిలేనిదే వేసంగిపాఠశాలలుస్థాపించినచో సంస్థాపకులకును విద్యార్థులకును ౩ ఏండ్లవరకు జైలుశిక్షయు, జుర్మానాయున్ను విధింతుమని శాసించియున్నారు.

అహమదాబాదులో హిందూపత్రికాసంపాదకులు ప్రాచీనవిద్యాపత్రికాసంస్థాపకులును అరెస్టుచేయబడినారు,

### బీహారుసత్యాగ్రహము

బీహారులో ౭౨౭ సత్యాగ్రహులపట్టిక గాంధీగారి అనుమతికై పంపబడినది.

## బంగారుకడ్డీల మోసము కేసు

కర్నూలు పోలీసువారు హైద్రాబాదుకు వచ్చుట

కొన్ని మాసాలక్రిందట కొందరు నవాబులు, వారికొన్ని హితులుకలిసి హైద్రాబాదు, మద్రాసు, కర్నూలు, బొంబాయి, గుల్బర్గా, మున్నగుప్రాంతాలలో ఒకేవమూనా మోసమును ప్రయోగించియుండిరి. వీరు పెద్దమనుషులుగా పోవుట, వెంట వర్తకాలుచేసి ఒక మోటారు తీసుకపోవుట, సాహుకార్లవద్ద నుంచి బంగారుకడ్డీలనుచూపి వాటిక్రయంలో సగంక్రయము మేఅప్పతీసుకొనుట ఆకడ్డీలను పార్సలుచేసియిచ్చినతర్వాత మోటారులోని మాటేగం ఒకమారు దాన్ని చూచియిస్తుంది అను ఉ, అంతలో వేరేపార్సలు మోటారులోపెట్టుకొని కేవలఃఅట్టిపార్సలునే యింకొకదానిబయటికందించుట. కొంతకాలానికి దాన్ని తెరిచిచూస్తే అందులోసంకుడ్డీలు, రాళ్లుఉండుట యీతంతు ప్రతిచోటాజరిగింది-కర్నూలులో వెంకటరామయ్య అనేకోమటి యీవిధంగా ౧౦ వేలు పోగొట్టుకొన్నాడు. అందుచేత కర్నూలు పోలీసువారు అగ్పటదగాచేసిన నవాబ్ మసూదుయార్ఖాను నవాబు సికిందర్యార్ఖాను, సయ్యద్‌మన్సూరు ఖాదిరీ, కొల్లపల్లి లక్ష్మీనారాయణ పారిపోయిన మరొకడు- వీరిని విచారించుటకు హైద్రాబాదు వచ్చినారు. అందుయిద్దరిని కోర్టులో విచారించుకొన్నారు. ఇద్దరునవాబులు జమానతుఇచ్చియుండిరి-కానివారు కోర్టులోహాజరుకాలేదు. జమానతుజప్తిచేయుటకై కోర్టువారు ఆలోచించుచున్నారు. ఈవిచారణ యింకాజరుగుతూవుంది.

ఇదేసందర్భములో హైదరాబాదు సరస్వతి బ్యాంకులోకూడా యిదేవిధమైన మోసం జరిగింది. దానివిచారణకూడా జరుగుతుంది.

## మతపాక్షిక నిర్మూలనము

డా- ఖాన్‌గారి ఉద్బోధ

౧౨జూన్‌నాడు కాశ్మీరుసంస్థానములో నేషనల్‌కాన్ఫరెన్సువారు-డా। ఖాన్‌గారికి సన్మానపత్రమర్పించిరి ఆసందర్భములో, ఖాన్‌గారిట్లభిప్రాయమిచ్చిరి. ఎంతవరకైతేహిందూస్థానములో మతపాక్షికదృష్టినశింపదో అంతవరకు హిందూస్థానమునకు స్వాతంత్ర్యముసిద్ధింపదు, ప్రపంచములోపరిస్థితులు తారుమారగుచున్నవి. మన కండ్లయెదుటనే గొప్పపరివర్తనము జరుగుచున్నది. దానినుండిమనము లాభముపొందవలెను. హిందువులు, ముసల్మానులు, సిక్కులు, అందరేకముకావలెను, మనకష్టాలకన్నిటికిమూలను మనదానిపతనమే, దానినివదలించుకొనుటకు మనముగొప్పప్రయత్నముజేయవలెను. ప్రభుత్వాధికారముమీలోనేయున్నది. మీలోఐకమత్యములేనందున మీరు దానిని సాధింపలేకున్నారు. దానిపతనములో ఏ మతముకూడ సురక్షితముగనుండజాలదు. మనరాజాలను, నవాబులనుకూడా హిందూస్థానముయొక్క బయటదేశాలలోనివారు గులాములవలె చూచుచున్నారు. హిందూస్థానానికి జాతీయలిపి ఆవశ్యకము. కావున, ఎంతవరకైతే యీదేశము గులామీదేశముగానుండునో అంతవరకు దేశముయొక్క భాషాపరిష్కారము కావలెను.

తరువాత, కాశ్మీరుప్రజానాయకులయిన షేక్ మహమ్మదబ్దుల్లాగారిట్లనిరి: కాశ్మీరుజనులు, మతపాక్షికమును ప్రతిఘటించుచున్నారు. ముస్లింలీగు రాజకీయాలు, కాశ్మీరుకుగాని, యిండియాకుగాని లాభముకలిగించజాలవు కాశ్మీరులోఅల్పసంఖ్యాకులయిన హిందువులున్నగువారు కోరుసంరక్షణలవిషయమును జవహరులాలునెహ్రూగారు కూడా ఎట్లుపరిష్కారముజేసిన నట్లు కాశ్మీరముసల్మానులు ఒప్పుకొనుటకుసిద్ధముగానున్నారు.

## శా-శ-౪౬౫ నాటిచాళుక్యశాసనముదొరుకుట

బిజాపూరుజిల్లాలో ఒకకోటలో శాసనమొకటి బయటపడినది. అదికర్ణాటచాళుక్యులనాటి మొదటి శాసనముగకన్పడుచున్నది ఇందు రాజుపేరు తెలియరాలేదు. కాని యిదిమొదటి పులకేశికాలమునాటిదిగాకనపడుచున్నది. ఇందు, అశ్వమేధయాగమును ఆకాలపురాజు చేసినట్లు వ్రాయబడియున్నది. శాసనముపై శకసంవత్సరములు ౪౬౫ అనగా క్రీ-శ-౫౪౩ వ్రాయబడియున్నది. ఇదిచాళుక్యశాసనములన్నిటిలో మొట్టమొదటిదిగాకనపడుచున్నది, ఇందు బాదామి నగరచర్చకూడాఉన్నది,

## బహద్దర్‌యార్జంగు ౨ నెలల మౌనము

న॥ బహద్దరుయార్జంగు బ॥ గారికి మరలపూర్వపుజాడ్యం పొటమరించియున్నందున వారు ౨ నెలలపాటు ఏసభలోను మాట్లాడకుండాయుండునని పత్రికాప్రకటన కావించియున్నారు- ఒకవేళ ఏసభకైనా తాము వెళ్లుతున్నారని ప్రకటించినట్లయిన అందువారు మాట్లాడకుండా ఊరక ప్రేక్షకునివలెకూర్చుని యుండువారేఅని గ్రహించవలెననియుప్రకటించినారు-

## హిందూ ప్రజా మండలి

సుల్తానుబజారు

౧౩జూన్‌నాడు హైద్రాబాదునగరం సుల్తానుబజారులో పైమండలియొక్క యెన్నిక క్రిందివిధముగ జరిగెను- అధ్యక్షుడు శ్రీనివాసరావు మహోల్కరు గారు- ఉపాధ్యక్షులు డా డావు రే- శంభి మల్లయ్య, బి.ఏ. జైన గారలు కార్యదర్శి ఏ. యస్. గోరే సంయుక్త కార్యదర్శులు- షులకర్ణి డా పితోరేకర్ గారలు- కోశపతి యమ్ యన్ పాటీల వీరుగాక ౭గురు సాధారణసభ్యులెన్నుకొనబడిరి-

### అనాథ విద్యార్థి గృహము

హైద్రాబాదు నగర హిందూ అనాథగృహ విద్యార్థులలో క్రిందివిధంగా ఉత్తీర్ణులైనారు. బీ ఏ.లో ౨ జూనియర్ బి ఏ. ౧ ఇంటర్ ౪. మెట్రిక్‌లో ౨ ఇంజనీయరింగు ౧వ సంలో ౨. ఆయుర్వేదంలో ౧వసం॥లో౧ రెండవ సం॥లో ౨. హైస్కూలుతరగతులలో ౩౪మందిఉత్తీర్ణులైనారు.



Printed and Published by, G Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn. Editor- S Prathapa Reddy B. A B,L.